# గజవిహారము

ఉభయభాషాప్రవీణ, అష్టావధాని,
వద్దాది సీతారామాంజనేయకవి.

శ్రీరస్తు

ఓంనమః కామేశ్వర్యై

శ్రీ రామ.

# గజవిహారము.

కృతికర్త.

ఉభయభాషాప్రవీణ, అష్టావధాని,

వడ్డాది సీతారామాంజనేయకవి.

(ఖాశింకోట, విశాఖపట్టణము జిల్లా)

పరిష్కర్తలు:

బ్రహ్మశ్రీ

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులవారు.

ప్రథమ ముద్రణము 500 ప్రతులు.

శ్రీఆనంద తీర్థ ముద్రాక్షరశాల,

రామచంద్రపురము

1937

 ఈశ్వరశ్రావణి. మూల్యము, 0—2—0

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# అభినందనము.

శ్రీరామగజవిహారముఁ । బేరిష్టముతోడ నాంధ్రగీర్వాణోక్త్యు
దారభువి నెఱపె నెంతయుఁ । బేరిమిఁ గోఁట పెదవీర వెంకన

మ. మనమం దీయెడ నెంచకుండఁ గలనా? మాన్యస్వభావున్, సుమి
త్రుని, వడ్డూరిసదన్వయాంబురుహమిత్రున్, మా జగన్నాథరా
జును, శ్రీమత్కవితాకళామ్నాతరసజ్ఞున్, నాకు మా వీరవెం
కననున్ నేస్తముఁ గూర్చి సత్ఫలము వేడ్కన్ గన్న పుణ్యాత్మకున్.

మ. తగుఁగాదే? హలసంపదం బొదలు సీతారామనారిత్రి మి
మ్ముగఁ దెల్గుం గొలమందు భద్రి మొదవన్ ముద్రించుటల్ మాసఖుం
డగు వెంకన్నకు, సీరపాణి; కృపనానాగ్రమ్ము సాగ్రమ్ముగా
వెగడన్, స్వీయయశంబు ధన్యమగుమన్ నిత్యమ్ము భాసిల్లఁగన్.

క. వీరనసాధ్విమణియును, । వీరాస్వామియును వీరవెంకన్నను గొ
ల్లాగాపుఁ గోడుకు గాఁగని । కేరింతఁ గోనిఁ గల్లైకూనుఁ గృతిఁ బ్రకటింపన్

శా. రామున్, శ్యామలమూర్తి నెన్ని డెగ నారాధించుమన్ సత్కవి
స్తోమంబున్ బుధలోకముం గనుచు దాసోఽహమ్మటంచున్ దయ
యామోదమ్మును జూఱగొంచు మను భవ్యాత్మున్ సదా ప్రోవుమా
మామిత్రున్ పెదవీర వెంకనఁ గృపన్ మాతల్లి కామేశ్వరీ!

క. కేసరికిశోరలీల ని । భాసురగతి నచ్చుఁగూర్పఁ బ్రిబలిన నా సం
తోసమె నామిత్రతతిన్ । శ్రీసంపద్వృద్ధిఁ దనరఁ జేయుత మెపుడున్!

రామచంద్రపురము
ఈశ్వరశ్రావణి.

ఇట్లు మిత్రుఁడు,
వడ్డాది సీతారామాంజనేయకవి.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

శ్రీరామ

# గజవిహారము.



మ. వనజాతాప్తశుభాన్వయాభరణ! సద్భక్తవ్రజోత్తారణా!
ఘనదశ్యామలకోమలాంగ! నిజకోపజ్వాలికాదగ్ధదు
ర్జనానీక! పినాకిపద్మజసురేంద్రప్రస్తుతవ్యాప్తతా
ఘనసంభావితదివ్యసచ్చరిత! సీతారామచంద్రప్రభూ! 1

మ. సిరి శిష్టావనతత్పరత్వమున ముందు శ్రీశ్యామలాదేవి నీ
ధరఁ బాలింపఁగఁ బంప కృష్ణుఁడవుగ రత్నద్వీపమందుండి వా
నరలోకంబును బ్రోవవచ్చిన మహానందైకవిజ్ఞానమున్
దరిదివ్యాకృతి వీవు నిన్ దలఁతు సీతారామచంద్రప్రభూ! 2

మ. పలువేసమ్ములు కేలఁ బూని, సకలబ్రహ్మాండముల్ రాజసం
బెలయన్ సృష్టులు వైరిజాలిమసఁ జిట్టై, యెంతేని యూడించి, విం
తల నవ్వారిగఁ జూపి, దేవినిఁ గడున్ వర్ణించి, తత్పూర్వగా
ఢ్యలుదేసి భాసిలునిన్ను నెన్నెదను సీతారామచంద్రప్రభూ! 3

మ. అవతారమ్ములు నీవు గొల్పఁగనె, యాయా దివ్యవస్తూత్కరం
బవనిన్ దోఁచెను, బోఁచి, దుష్టసంహారవ్యాపారమున్, శిష్టమా
నవసంరక్షణదీక్షయున్, దగునటుల్ సంధించి లోకాళి కు
త్సవమున్ గూర్చు నిరర్గళప్రతిభ సీతారామచంద్రప్రభూ! 4

మ. పులుఁగుందోయి నాకంబు బోయఁ డడఁపన్, బొంగారుకన్నీటివాఁ
కలలో బ్రుంగుచుఁ, బుట్టుపుట్టు నద శోకం బొంద శ్లోకంబ యై
లలితోదారభవత్కథాకథనలీలన్ మించెఁ; దత్పావన ము
క్తాళికన్ నించి తరింపఁజేయు మము సీతారామచంద్రప్రభూ!

# గజవిహారము.

మ. ననుఁ వాత్సల్యముతోడఁ జూచెదు పురాణం-సూర్యనారాయణా
ర్యుని, మత్తీర్థుని, జ్ఞానతీర్థునిఁ, గవితోర్వీదీర్ణసామ్రాజ్యశా
సను, దేవీసతతాధివాసవిమలస్వాంతాంబుజున్ నాయెడం
దను సేవించెద భద్రసిద్ధికయి సీతారామచంద్రప్రభూ! 6

మ. లలితాకారత నొప్పు నీదుమహిమోల్లాసంబు నీక్షింపఁగాఁ
గల సామర్థ్యము నాకొసంగినగురున్, గారుణ్యసంపన్నునిన్
వెలఁతున్ గప్పులవాటువంశజు, జగన్నాథాహ్వయున్ బుత్త్రవ
త్సలతన్ నన్ను నజస్రమున్ మనుప సీతారామచంద్రప్రభూ! 7

మ. కవితోద్యన్మహిమాశ్వమేధమఖదీక్షున్ బ్రహ్మతత్త్వామృత భా
గవతోత్తంసుల కిచ్చి, భారతమహాఖ్యాతిన్ జెలంగించుచున్
శ్రవణానందము మాకొసంగు సుమనశ్శ్రేష్ఠులన్ గొల్తు స
ద్భవులన్, దిర్పతివేంకటేశ్వరుల సీతారామచంద్రప్రభూ! 8

మ. వ. సు. రాయాంచితనామధేయు, శుభతత్త్వశ్రీసముద్యత్కళా
ప్రసితున్, సూక్తిసుధానిధిన్, సకలవిద్వల్లోకచూడామణిన్
వసుకావ్యప్రసవార్చితాంఘ్రివసుధాప్రారంభు, మద్వంశగం
ధసమీరున్, గవిశేఖరున్ దెలుతు సీతారామచంద్రప్రభూ! 9

మ. ఘను, వడ్డాదిసదన్వయాంబునిధిరాకాచంద్రుఁ, బద్మాఖ్యమా
నినికిన్ రామయమంత్రికిన్ దనయునిన్, విద్వాంసుఁడౌ తిమ్మరా
జునకున్ శిష్యవతంసు, మజ్జనకు, విజ్ఞున్, విజ్ఞసమ్మాన్యు, జ్ఞా
తనయున్ గొల్చెద భీమశంకరుని సీతారామచంద్రప్రభూ! 10

మ. అతిమాత్రంబుగ మున్ గవీశ్వరులు నీ కర్పింపరే? తారహా
రతతుల్, భాసురభూషణోత్కరము; నౌరా! త్వత్ప్రభుత్వోన్నత
స్థితి కింతేనిఁ దదంగముల్ వలయుఁగాదే? కాన నీకుంభదా
తతమత్తేభములన్ గ్రహింపు మిఁక సీతారామచంద్రప్రభూ! 11

మ. వివిధశ్రీ లెవి యున్నఁ బూర్ణతను బ్రాపింపంగలేఁ డెన్నఁగా
నవనీశుం డటుగాన నిచ్చితి "గజాంతైశ్వర్య" మన్మాట నా
త్మ విలోకించి నిరూఢతత్వగత నిమ్మత్తేభముల్; త్వన్మహా
త్త్వవిధిన్ మించుము సార్వభౌముఁడుగ సీతారామచంద్రప్రభూ! 12

మ. మును లే దిచ్చిరి నీకుఁ? బత్రిమొ ఫలంబో తోయమో కాక; నేఁ
డనురూపంబుగ నిచ్చినాఁడ భవదధ్యక్షత్వసంవర్ధకం
బని మత్తీర్థకృపాబలాప్తకవితోద్యద్రాజ్యశోభా సహా
ఘన మత్తేభకళంబుఁ గైకొనుము సీతారామచంద్రప్రభూ! 13

మ. జలదశ్యామల దేహుఁ, బుష్కరమనోజ్ఞశ్రీకరోత్సాహునిన్,
విలసద్దానరమాకళాసిఁ, ద్రిజగద్విఖ్యాతసత్త్వోదయున్,
సలఁతున్ నిన్ రఘుపుంజరున్ సతము భద్రస్ఫూర్తి నస్మన్మన
స్స్థలి సంచార మొనర్చి యుల్లసిల సీతారామచంద్రప్రభూ! 14

మ. అనురాగంబు ఘనంబు నీ కెపుడు వేదండంబునన్ నక్రబా
ధను నిర్మూలము చేసి ప్రోచితివి కాదా మున్నె? భక్తాళితో
ననుబంధం బది నీకు రూఢ; మిఁక నాయందు దయన్ నించి, నన్
దనియన్ జేయుము నాకుకాన్కఁ గొని సీతారామచంద్రప్రభూ! 15

మ. మును గోదావరి చెంగటం దిరుగుచో భూజాతయున్ నీవు మీ
జీనవేడ్కన్ గరిణీకరేణువులఁ బేర్మిం బెంచి, లాలించి, పెం
డ్లి నొగిం జేసి వినోద మందితిరి; తల్లీలాప్తి మద్దత్త నూ
తనమత్తేభకళత్రమ్ము దాఁ గొలుపు సీతారామచంద్రప్రభూ! 16

మ. భవభూతిన్ గవి పోతనన్ మనుపవే? భవ్యానుకంపాసుధా
సవనోద్ధర్ష ముపేర్మి, నీ కిరువు రుత్సాహాప్తి మత్తేభవ
ర్యవిలాసోద్ధతిఁ గూర్చినందులకె; నే నంబారి నెక్కించి యు
త్సవముం జేయుదు; నెట్లు నన్ మనుతువో? సీతారామచంద్రప్రభూ! 17

శా. శ్రమమం బొందినపిమ్మటం గద కరిన్ రక్షించినా వందునో,
నిముసంబైన విలంబ మోర్వ నిఁక; నాకేల నీ వుపేక్షించుటల్?
సమయం బయ్యె, గజావలోకనమె శాస్త్రం బన్న నీ కిచ్చ టు
త్తమమే కాదె? తఱిన్ ననున్ మనుపు సీతారామచంద్రప్రభూ! 18

మ. "సముదస్ఫూర్జితశాత్రవానుచరసంప్రోగప్రమోదంబె కా
క మహిన్ సత్కృతి కబ్బునే కొఱఁ కనుల్లోకాంతలోకటాక్షంబు?
ట్లమరన్ భద్రగజంబు లిచ్చు నితఁ" డం చాశ్చర్యమా? మాప్రభు
త్వమునన్ లోటేది? శ్రీ వినాగ నిఁక సీతారామచంద్రప్రభూ! 19

శా. సితదంతావళిధాటి నాఁగుటకు శౌరీ! స్వేచ్ఛాప్రకాశుండవు, న
ప్రతిమానుం డేకరుండవు కాపులయుఁ దక్షత్ప్రథన్ వివేకించి యం
కితముం జేసిన వీని నీ కిప్పుడు, తత్త్రిదావిలాసమ్ము లా
ప్తతమైఁ గన్గొనుచున్ విరాజిలుము సీతారామచంద్రప్రభూ! 20

మ. గురుధైర్యాంకుశసంప్రయోగమున నీకున్ లొంగి వర్తింప స
త్వరగతిన్ నిగ్రహశక్తిశృంఖలను విద్యుంత్రిప్రభావాప్తిఁ ద్వ
త్పరిణామాగ్రమునన్ మదాత్మగజమున్ సంధించి బంధించి యో
త్తమశ్రీనైనన్ జలియింప నియమము సీతారామచంద్రప్రభూ! 21

మ. అనివార్యత్వగ నెల్లెడన్ బఱచి యత్యాయాసముం బొందు నా
మన మన్ హస్తిని భక్తిరజ్జుపటిమన్ బంధించుమన్ నేర్పుగాఁ
బునరావృత్తివిహీనసుస్థిరపదంబుం జేర్పవే త్వద్విభు
త్వనిరూఢోన్నతి సార్థమై పరఁగ సీతారామచంద్రప్రభూ! 22

మ. తరణీందుల్ జయఘంటలై యిరుగడన్ దళ్కొందఁ, గాలాభ్రమున్
బురుడింపం దగు గంధసింధురముపైఁ బొల్పొంది, ఫాలాలికన్ చాల్
తలచై యాదల నొప్ప, శ్రీవిమెయి, సీతన్ బావనిం గూడి, త్వ
త్పరమాత్మద్యుతి నింపవే జగతి? సీతారామచంద్రప్రభూ! 23

మ. నిను సేవించుట, నీమహామహిమముల్ నిత్యమ్ము వర్ణించు, టె
ట్టనిశో నాకుజునట్టిధన్యునకు సంప్రాప్తించు నేకాని వ్య
ర్థున కెట్లబ్బును? బ్రహ్మ, శాసనము సంశోధింప కీఁగల్గినం
తనె యా నారదు లౌదు రెల్లరును సీతారామచంద్రప్రభూ! 24

మ. శ్వపచుం డైనను మోక్షముం బడసె నావాల్మీకి నీనామముం
జపముం జేసియె, యంతెకాక కవితాసామ్రాజ్యపట్టాభిషే
కపుసద్గౌరవ మందె నాదికృతి కాఁగా నీకథల్ వ్రాసి; మో
దపదౌన్నత్యనియంత వీవుకద సీతారామచంద్రప్రభూ! 25

మ. కవు లన్నన్ విహగమ్ము లన్ప్రియమునం గారుణ్యముం బూని ప్రో
తువు నీ వెప్పుడు వామలూరుభవుమాధుర్యంపు "రామ్ రామ్" క[illegible]
రవ మాలించి ప్రహృష్టతం గవికిపఖ్యాతిఁ బొందించి త
ద్భవము న్సార్థకముం బొనర్చితివి సీతారామచంద్రప్రభూ! 26

మ. ఎద వాల్మీకి మహాకవిన్ దలపఁగానే గొబ్బునన్ గోచరిం
చెద రాభాస్కరపాపరాజుకవిశ్రేష్ఠుల్ స్వజాతీయసం
పద సొంపొందెను నీదుదివ్యచరిత న్వాగొప్పఁ జేపట్టి; త
త్పదమాహాత్మ్య మనన్యసాధ్య మగు సీతారామచంద్రప్రభూ! 28

మ. నరులున్, వానరులున్, విహంగములు, నానాజాతులున్ బాడు నీ
వర"చారిత్రము, నెవ్వ రెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే!"
సరసాలాపపటుత్వ ముండుటఁ ప నీసంకీర్తనంబే మహ
త్తరభాగ్యం, బటు కాకచో వృథయె సీతారామచంద్రప్రభూ! 28

మ. మునుమున్ దిక్కనమంత్రి నీదుచరితమ్మున్ వ్రాయుటన్ గాదె పా
వనమా లేఖినితోడ నొప్పె విరచింపన్ బంచమామ్నాయ మెం
దెన లేనట్టి మనోహరాంధ్రకవితాహేలాసమారూఢిఁ; ద
ద్ఘనకారుణ్యము భక్తహర్షదము సీతారామచంద్రప్రభూ! 29

# గజవిహారము.

మ. 'ఎకతారిన్' గొని త్యాగరాజకవి నిన్నే యాంధ్రగీతప్రబం
ధకలాపంబులఁ బాడె, గింగురుమనన్ దన్నాదలేశమ్ము నేఁ
టికి మావీనుల! గాఢమై నిలిచె మాడెంగాన నీదివ్యత
త్త్వకళాపాదకమైన తత్ప్రతిమ సీతారామచంద్రప్రభూ! 30

మ. తులసీదాసునభంగవాక్సుధలలోఁ దూఁగాడు నీలీల యు
జ్జ్వనానావిధకావ్యనాటకలసత్సారస్వతస్ఫూర్తి ని
చ్చలు దీపించియుఁ జాలునన్ దలఁపు నించంబోవ దెవ్వారికిన్;
దలఁపన్, బల్కఁగ, నెంచ శక్యమొకొ? సీతారామచంద్రప్రభూ! 31

మ. కవయిత్రీమణి, మొల్ల మొల్లమగునేర్పున్ మొల్లనెత్తావి వె
ల్లువతోడన్ శబరీసమర్పితఫలాళుల్ చిందక్రొందేనె లు
ద్దవిడిన్ మిశ్రముచేసి నింపె జగతిన్ ద్వత్రాప్రభవస్ఫూర్తిఁ; ద
ద్భవమే సార్థక, మొల్ల దైహికము సీతారామచంద్రప్రభూ! 32

మ. ఘనభక్తుం డని రామదాసు, ననఘున్, గంచెర్ల-గోపన్న నీ
వనుకంపన్ గని బంధముక్తునిగఁ జేయన్ దీక్షఁ గొన్నట్లె దీ
నుని నన్ సంసృతిబంధనాకులత నెందుం బొందనీకుండ బో
ధనముం గూర్చి తరింపఁజేయఁగదె సీతారామచంద్రప్రభూ! 33

మ. పరమార్థమ్ము గణింప నిర్గుణపరబ్రహ్మంబ వీ వయ్య; ని
ర్భరచైతన్యము నీవుఁ గల్గెఁ బ్రకృతిన్, భామామణిన్, జానకీ
తరుణిం గూడఁగ; హర్షదం బగుఁగదా దాంపత్య! మ ట్లౌట నే
తరుణీయుక్తుఁగఁ గొల్చుచుంటి నిను సీతారామచంద్రప్రభూ! 34

మ. పదునాఱేండ్లకె తత్త్వబోధమున జీవన్ముక్తిఁ గైకొంటి వీ;
వది శ్రీతీర్థపదప్రసాదమొ, వసిష్ఠర్షిప్రభావమ్మొ యౌఁ
గటె! సంసారపసారమన్ మతి సుసాంగత్యమ్మునన్ గాక పొం
దఁ దరంబౌనె మహాత్మకుం చందమున? సీతారామచంద్రప్రభూ! 35

మ. అతిభక్తి న్నినుఁ గొల్చి మున్నహహ! త్రైలోక్యస్థానంబుల్ శుభ
స్థితియు న్మోక్షపదంబు నొందఁగ, నరుల్ శైల్యాందియుం బ్రాప్తి మూ
ర్ఖతమై నీశుభనామముం దనివి దీఱ న్నార నోరార ను
ద్యతభక్తిం బగఁ బల్కఁబో రకట! సీతారామచంద్రప్రభూ! 36

మ. వెడలం, డుండఁడు, ఖేదముం గొనఁ, డభీప్సింపండు, వీడండు, చే
యఁ డెదేనిం, బరిణామ మొందఁ, డచలుం, డానందరూపుండు, రా
ముఁడు మాయావృతుఁ డౌట నట్టె తనధర్మంబో యంచు, నిలీల, సం
దడితోఁ జూడెఁ ద్వదీయతత్త్వమును సీతారామచంద్రప్రభూ! 37

మ. తను పన్నంజరమందుఁ జిక్కుకొని తీక్ష్ణప్రాభ్యతత్త్వప్రభో
ఘన మన్నత్ఫలసిద్ధి నొంది యెటొ యాత్మజ్ఞ్యాతకీరంబు నీ
ఘననామస్మరణంబుఁ జేసెడు నిదే! గారానఁ దిప్పింపవే
తనియ న్నిను ముద్దుఁజక్కెరలు సీతారామచంద్రప్రభూ! 38

మ. అరివిధ్వంసక, మాగమార్చితము, బ్రహ్మాద్యేకజప్యంబు, దు
ర్భరదారిద్ర్యమహాబ్ధిపోతము, శరీరత్యాగకాలమ్మునన్
స్మరణీయం, బగదంకరంబు, ఘనసంసారాటవీదావ మె
త్తఱి నీనామము; సంస్మరింతు నిఁక సీతారామచంద్రప్రభూ! 39

మ. వెలికిన్ బర్విడు లోనిపాపములు తెల్విన్ 'రా'యనంగానె, 'మా'
తలుపుం బోలెఁ బ్రవేశ మీయక పడిన్ దప్పుమ్మతో వాని న
వ్వల నడ్డుం; బదునాల్గులోకములుఁ గైవల్యమ్ము నొందంగఁ జి
త్కల నిక్కమ్ముగ నద్దియే తలఁప సీతారామచంద్రప్రభూ! 40

మ. జననీగర్భగతుండవై వనరుచో సంరక్షముల్ జేసి త
న్నిన నీకారుణికత్వ మెంచఁదగునే నేఁడేమొ నాపాలి నీ
ర్ఘృణ సాధింపఁ గడంగితీ వకట! కౌసల్యాగతిన్ స్తన్యముం
దనియం గ్రోలిన నీకు మేలె యిది? సీతారామచంద్రప్రభూ! 41




మ. ఇనవంశం బను నాలవాలమున నీ వింపొంద జన్మించి, య్యా
జనకాధీశకుమారికాలతను నిచ్చల్ ప్రాపుగా నుండి, నీ
యనుజుల్ శాఖలు గాఁగ నొప్ప, నసుకోద్యద్దీప్తి మీరంగఁ గెం
తను మమ్ముంతు సురద్రుమంబ వయి సీతారామచంద్రప్రభూ! 42

మ. ధరణీజామృదుసుందరాంగవిలసద్బాహుద్వయీశాఖలుం,
బరవిజ్ఞానసుమశ్రీజంబును, మహానందామృతాంచత్ఫలో
త్కరమున్ రాజిలఁ గల్పవృక్ష మగునిన్ గల్యాణదాయిన్ నిరం
తరమున్ నెమ్మదిఁ గొల్చుచుండెదను సీతారామచంద్రప్రభూ! 43

మ. వరకల్యాణమహామహంబును, లసత్పట్టాభిషేకంబు, భా
సురవాసంతమహోత్సవంబు ధరలో శోభిల్లఁగా నీకుఁ ద్వ
ద్వరనామాంకితు లెట్టు లుండిరో వెతన్ వ్యత్యాస వీక్షించి పే
దలికం బేటికిఁ బాప వింకయిన? సీతారామచంద్రప్రభూ! 44

మ. గురువాక్యప్రతిపాదనప్రతిభ, సత్కోదండపాండిత్య, ము
ద్ధురశాంతంబు, సుశీలరక్తి, స్వసతీతోషానుభోగంబు, స
త్కరుణాపాంగవిలోకనవ్రతము బోధం జేయు నంచు న్నిరం
తరము న్నీచరితమ్ము నెన్నెదను సీతారామచంద్రప్రభూ! 45

మ. దురహంకారము, దుఃఖముల్, దురితముల్ దూరీకృతం బయ్యె, నా
దురదృష్టం బరలెన్, దురుక్తి లెడలెన్, దోషంబు లీఁగెన్ భవ
చ్చరితంబు న్మననం బొనర్పఁగ మహైశ్వర్యక్రియల్ పెక్కు స
త్వరతం జొప్పడు నీమహత్త్వమున సీతారామచంద్రప్రభూ! 46

మ. ఘనతత్త్వాకృతి వయ్యు నీచరిత ముత్కంఠన్ జనుల్ దర్పణం
బును బోలెం గొన విశ్వనాటకము సమ్మోహాత్మకప్రక్రియం
బొనరం జూపితివయ్య; నీవగుభవంబుం, బెండ్లియుల్, వంశవ
ర్ధనరాజ్యక్రియ లెల్ల వింత లగు సీతారామచంద్రప్రభూ! 47

మ. గురుధిక్కారము జేయువారిని విపేకుల్ గా నొనర్పంగ మున్
శరసంధాన మొనర్చి తాటకను విశ్వామిత్రునాజ్ఞ న్వగన్
బోరగొన్నాడవు కాంత యన్న కనికరంబుం బొంద కానా హృదా
తరమందుం బిననాటనే యవుర! సీతారామచంద్రప్రభూ! 48

మ. క్రతువుం గావరె? ధర్మకర్మరతి ముఖ్యంబంచు జాటంగ ద
త్ప్రతిపక్షాసురపంక్తి గూల్చి, నిరాతంకంబు గావించి, సా
ధుతతిస్తోత్రము లంది మించుచు నహో! దుర్మార్గనిర్మూలనో
ద్యతదీక్షాసమభారభాగ్జవి సీతారామచంద్రప్రభూ! 49

మ. కలికా లాయిరొ నీదుపద్రజము సోకన్ సుందరీరత్నమై
వఱలె న్రాయిరె! నేడు మానిలయముం బట్టాభిరామోన్నతి
న్గణింపం దొరకొన్న నీనియతి బల్కన్నేరనే? మత్పుణ్యస
త్పరిపాకం బిదిగాక నిక్కముగ సీతారామచంద్రప్రభూ! 50

మ. శివచూడామణియై, పవిత్రుడయి, వాసింగన్న చంద్రుం డహో!
భవదాఖ్యాకలన న్విరాజిలెడు సన్నద్ధాభిధానంబుతో;
నవునా ద్వత్కరుణాసుధాలహరి దోగాడంగ గండ్రాయియున్
ధవళాబ్జేక్షణయై యొసంగుగదా! సీతారామచంద్రప్రభూ! 51

మ. జనకుం డుంకువ పెట్టు శంకరమహాచాపంబు ముక్కంచి, మీ
జనకుండు, న్జననుల్, వసిష్ఠుడును, విశ్వామిత్రుడుం దక్క స
న్మనులు, న్నృపప్రియులుం జెలంగగ నాపూర్ణేందుబింబాస్య, సీ
తను జేబట్టితి వౌర! నీమహిమ! సీతారామచంద్రప్రభూ! 52

మ. దురహంకారము చెల్ల దన్నియెడల న్క్రుంగుం దుదిన్, భార్గవుం
డురుకోపంబున నిన్నెదిర్చియును బిత్రోద్రేకము న్మాని తా
నరుగం డోర్కొ స్వసంచితుం డగుచు; గృత్యాకృత్యముల్ నేరమి
న్నర మే మోసము దాట నెవ్వరికి? సీతారామచంద్రప్రభూ! 53

మ. పరమం బౌఁజూమ స్వార్థము న్విడిచి విశ్వశ్రేయమున్ గోరు; టీ
శ్వరమార్గంబె యవ్వసిష్ఠుఁడు భవత్పాలిన్ స్వరాజ్యాభిషే
కరతిం గట్టినకంకణంబున మహోద్గ్రాక్షంబుగాఁ దోఁచు; ని
ద్ధరణి న్నీయవతార మిందులకె సీతారామచంద్రప్రభూ! 54

మ. శతవృత్తిన్ స్వకనామధారులు ప్రజాస్వాతంత్ర్యము న్మాపఁగా
హతముం బూనిరి; సామ్యవాది వగునీ వాదౌష్ట్యము న్మాపి, చి
న్మతముల్ నిల్పి, ప్రజాప్రభుత్వవిజయామ్నాయాంచితోద్గ్రంథ స
త్ప్రతనాసంపము నింపు మెల్లెడల సీతారామచంద్రప్రభూ! 55

మ. అకళంకం బగుసోదరత్వ మది మీయందే నిరూఢమ్ము, కా
నక నిన్నంపినయామెనందనున కానందమ్ము సంధిల్లఁ బా
దుక లీ విచ్చితి, వాతఁడుం గొలిచె నీతోనే జగం బంచు, నొం
దక భోగమ్ములు భక్తవర్యుఁ డయి సీతారామచంద్రప్రభూ! 56

మ. అడవుల్, కొండలు మెట్టి నీచరణదివ్యాంభోజముల్ నైఁచె రా
యిడి, కత్తావులకంటె నాహృదియె తా నిక్కట్లు నేఁ డెవ్విధిన్
బడుచున్నన్ మృదు వౌఁ! యెప్పడనుకైనన్ సాటి గాకుండు నే?
తడ వేలా? యిట నింకఁ గాల్నిలుపు సీతారామచంద్రప్రభూ! 57

మ. వనవాసంబున కేఁగునప్పుడు భరద్వాజుండు కందంబులే
తన నీ కిచ్చె, నయోధ్య సమ్మరలువో దివ్యంబుగా విందుఁ, న్
దని పెన్; నీ వపు డిప్పు డొక్కఁడ వపస్థల్ మాత్రమే భిన్న; మి
త్తను వెత్తుం గల శక్తి భేదము లె సీతారామచంద్రప్రభూ! 58

మ తనకర్మమ్ము భుజింపకుంత నెవరుం దప్పింపఁగా లేరు నీ
ఘనచారిత్రమె సాక్షి దీని కయినన్ గాసిం బడం జాల కి
ట్లనుజాపించెన నిన్నుఁ బొందినను నా కాకర్మసూత్రంబొ? దం
దన యీ జ్ఞేలికిఁ? బోవ రాఁగద సీతారామచంద్రప్రభూ! 59

మ. ప్రజ నారాధనసేయు టన్న విగులన్ రంజిల్లు నాబుద్ధి, నన్
ఋజుమార్గంబునఁ ద్రిప్ప నెంచినను జేర్మిం గూర్పు భోగంబులన్;
స్వజన శ్రీ పురయో నీమాహాత్మ్యనము; తత్సద్ధర్మ్యముల్ నిల్పఁగాఁ
దృఢియిం పన్ దొరఁకొంటి వన్నెయును సీతారామచంద్రప్రభూ! 60

మ. ప్రణుతోద్యోగమునన్ దనూసనమనఃప్రాణంబు లర్పించి త
త్ప్రణవాకారు నినున్ భజింప నటచేత న్ముక్తి చేకూరు; రా
వణునిన్ దాఁకి జటాయు వాక్షితిజఁ గావన్ నీకునై ప్రాణి త్య
గ్గణుతిం బొంది తరింపలేదె మును? సీతారామచంద్రప్రభూ! 61

మ. భ్రమ మున్ హేమమృగంబు నిన్ బలె నను న్బల్వాచులం బెట్టెడున్
భ్రమ లిం కేను సహింపలేను విమలజ్ఞానేషువున్ నాకు వే
గముగా నిచ్చిన దానిఁ ద్రుంచి కడు వేడ్కం బొందుమన్ నిన్ను డెం
దమునం గొల్వఁగ నోపుదుం బిదప సీతారామచంద్రప్రభూ! 62

మ. సతము న్మోహవనంబునం దిరుగు, చాశాశాఖల న్రాఁకు, చు
ద్ధతిమై జవ్వని గబ్బిగుబ్బకవపై దాఁట న్విజృంభించు నా
మతి యన్గోఁతిని నీదువాహనముగన్ బన్నించి మన్నింపు మున్
దతలాంగూలిబలమ్ము నేలవొకో? సీతారామచంద్రప్రభూ! 63

మ. సరదాల్లై నినుఁ గొల్తు రం చయిన వాత్సల్యంబున న్మేదు పే
దతికంబుం బెడఁబాపి, భాగ్యమును బొందం జేయు మోయయ్య! నీ
సరివాఁ డొకటికాదె కోఁతికి భవిష్యద్బ్రహ్మపట్టంబు స
త్వరతం గూర్పఁగనుంటి వర్మిలిని సీతారామచంద్రప్రభూ! 64

మ. హనుమంతు న్బలె నీపదాబ్జయుగళి న్హస్తంబులం బూనుచుం,
గనుదోయిం దమి నద్దుకొంచు, మతి వత్సప్రేమ నానించి, త
ద్ఘనసౌరభ్యముఁ గ్రోలి, నాశిరము మీఁదం దాల్చి హర్షంబుతోఁ
దనర న్నాకొనగూడు టెంకెపుడొకో? సీతారామచంద్రప్రభూ! 65

మ. అనుసంధించితి వక్కణంబు భవదీయ శ్రీభుజద్వంద్వ మ
త్యనురాగమ్మునఁ జూపి, జ్ఞానమును, సౌఖ్యంబుం బ్రసాదించితిం
గొనుమంచుం బవమానసూనుని బళా! కొండాడుకు న్మన్కి యా
తని జన్మం బది యీసుఁ గొల్పఁగలదే? సీతారామచంద్రప్రభూ! 66

మ. హనుమద్భక్తుని భూమిజారమణి మాయాసన్నిధిం జేర్చి చెం
తను దత్త్వాత్ముఁడ వీవు సాక్షి వగుచుం గన్గొంచు నద్వైతబో
ధన మాయంబిక చేత నాతనికి మోదం బొప్పఁ జేయించి యా
తని ధన్యాత్మునిఁ జేసి తీవు మును సీతారామచంద్రప్రభూ! 67

మ. రిపు లొంటెంబడుచు న్నబాధ లిఁక నైకింపంగ లే, నీవు ము
న్విపినావాసమునందు నొంటెనపు హాపేశన్బలె న్మించి య
త్యపహాస్యమ్ముల పా లొనర్చితివి మదీయంబైన జన్మంబుఁ మ
త్రిప నీసత్కృప లేక యెట్లుగలు? సీతారామచంద్రప్రభూ! 68

మ. తనుసౌఖ్యం బను లాగ్గు రిందిరియపానద్వారప్రదేశాల వెం
టను వేవేగము సొచ్చి జ్ఞానమను రత్నజ్యోతి మాయాపటం
బున నాచ్ఛాదన చేసె; రామ్మరుకు సహా! మోసం బిఁక కెట్లో మొదో?
ధనురాచార్యుని నిన్నుఁ జేరితిని సీతారామచంద్రప్రభూ! 69

మ. "ఘనముల్ గొమ్మిక వెయ్యాగభోక్త వగునో స్వామీ! భవత్ప్రీతిగాఁ
బలుపాటుల్ పడి తెచ్చి యిచ్చితిఁ, దరింపం గంటి దత్త్వంబునం
గలయం గా సెలవా?" యటన్న శబరిం గైవల్య మొందింపవే!
తలఁతు న్నా కొనగూర్పు మాసుఖము సీతారామచంద్రప్రభూ! 70

మ. అల సుగ్రీవున, కవ్విభీషణున కారా! రాజ్యముం గట్టి తీ
వెలమి న్భత్తప్రసన్న బొసఁగుటయు నెంతే ముదమ్ముగా; నీకు ని
ర్మలధర్మంబున నెంత పట్టుఁదల! నీమాహాత్మ్య మే మందు! భూ
తలమం దిట్టిది యున్నఁ జేఁ గలదె? సీతారామచంద్రప్రభూ! 71

మ. ఉడుతం బోలిన యల్పజీవి నగు నాయుద్యోగ మీక్షించి, ము
న్నడరన్ దాని మెయిన్ సువర్ణముగఁ జేయం జాలిఁగొన్నట్లె యి
య్యెడ నా యజ్ఞమునందు నాఘవము నెంతేనిన్ సువర్ణస్ఫుర
త్తడిదుద్దీప్తిఁ జెలంగఁ జేయఁగదె సీతారామచంద్రప్రభూ! 72

మ. శిలలన్నీటను దేల్చెఁ, గోఁతులకు నుష్ణీషంబులం గూర్చె, ది
వ్యలసద్బోధముఁ బిట్టలం దుడుతలం గావిర్భవింపించె నీ
యలఘుప్రాభవశక్తి, యట్టిదిఁక నాప్రార్థము న్మార్చి చి
త్కలితానంద మెలర్పఁజేయదొకొ? సీతారామచంద్రప్రభూ! 73

మ. కడలి న్నీకడకంటిచూడ్కి కొన కుగ్రస్ఫూర్తి రాజించి, ము
క్కుడియౌ రావణుఁ ద్రుంచి భూమితనయం గైకొంటివి; పట్టంకి యె
క్కుడ నీదీక్ష కహో! మహాత్మ్యప్రతినల్ గా సర్వసిద్ధంబు, లా
తఁడె స్వాతంత్ర్యపరాయణుండుగద! సీతారామచంద్రప్రభూ! 74

మ. కృప నీ కెప్పుడు వచ్చునో యని నిరీక్షింతు న్సదా, నీవు మున్
రఘుసోదర్యుని నవ్విభీషణునిఁ గూర్మిం బ్రోచుటన్; నన్ను నిం
కిపుడేనిం గృపఁ జూడ వేమిటికొ యిస్సీ? నిన్ను మ్రొక్కంగ హ
స్తపుటంబుల్ తెగఁగోయఁగావలదు సీతారామచంద్రప్రభూ! 75

మ. సెన రీ వూన శిరీషపేశల మొహో! నీమానసం బద్ది మా
కనుకూలించును గాక! శత్రువులపై సత్యాగ్రహం బీవు చెం
దిన వజ్రప్రతిమాన పార! యది మద్విద్వేషులం బొందిత
ద్ఘనగర్వంబు నడంచుఁగాక యిఁక! సీతారామచంద్రప్రభూ! 76

మ. పటుసంకల్పబలంబె యున్న నొనగింప న్వచ్చు శీఘ్రింబ యెం
తటికార్యంబులనైన నిట్టి, లనయంతే న్వచ్చు సాహాయ్య ము
ద్భటమై; సత్క్రియలోన నీకళలు స్నిగ్ధస్ఫూర్తి నుంట న్మహో
త్కటపుఖ్యాతికి మూల మా నదియె సీతారామచంద్రప్రభూ! 77

మ. ఫలితంబుల్ భవదర్పితంబు లగుచోఁ బ్రారంభసమ్యగ్గతుల్
విలసిల్లున్ జయలక్ష్మి నొంది మహిజావేణిం గలాపంబుగా
లలి సంధింపఁగ మత్ప్రియత్నసుమమాల్యంబు న్సమర్పించితిన్
దళుకుల్ గుల్కెడు నీదుపాదముల సీతారామచంద్రప్రభూ! 78

మ. పృథివిన్ స్వోదరపోషణార్థినయి వారి న్వారి నర్థింపఁగన్
వృథగాఁ గ్రిమ్మరుచుంటి నీభజన నే నింతే నొనర్పం గటా!
ప్రథితప్రాక్కృతమామకీనసుకృతప్రాగల్భ్య మీ వెంచి స
త్పథముం జేర్పవె కూర్మి న న్మనిచి సీతారామచంద్రప్రభూ! 79

మ. తనువే ముఖ్యము ధర్మసాధనముకుఁ గాదా? కావునన్ దానిఁ బెం
చనె భాగ్యమ్ముల నెల్ల నిమ్ము; తొలుత న్నారోగ్యముం బొంది మీఁ
దను సాయుజ్యము నందెద న్నిజముగాఁ దత్త్వార్థ మట్లైన నే
తనరారున్ శ్రుతిశాసనం బిదియె సీతారామచంద్రప్రభూ! 80

మ. ఎఱుఁగ న్నే నిహసౌఖ్య మొందుటకు ని న్నేమేమి వాంఛించుటో
కొఱఁతల్ దీఱవు, బాధ తగ్గ, దొరులం గోరంగ నాస్తిత్వమే
పొరయున్ ఛీ! వృథ యయ్యె నాబ్రతుకు; నన్బోషింప నీ వుండఁ బే
దఱికం బొందుట దేటిపాప మొకొ? సీతారామచంద్రప్రభూ! 81

మ. మతి నిన్ ధ్యాన మొనర్ప, వాక్కులు నుతింపం, బాణు లర్చింప, మ
చ్ఛ్రుతియుగ్మంబు భవత్కథల్ వినఁగ, నక్షుల్ నిన్నుఁ జూడంగ ధ
న్యత నొందుంగద యింక నేమిటికి నన్యగ్రంథపారాయణో
ద్యతవిభ్రాంతి? తొలంగఁజేయు మది సీతారామచంద్రప్రభూ! 82

శా. నది వార్ధిన్, లత వృక్షము, న్సతి పతి న్బ్రాపించునట్టుల్ భవ
త్పదపంకేజములందె నామదిని నిల్వం జేయుమా నిన్నె వేఁ
డెద భక్తావనదీక్షితుండ వగుటన్ డెందమునన్; "వాంఛితా
ర్థద! మాం పాహి నిరంతర" మ్మనుచు సీతారామచంద్రప్రభూ! 83

మ. కలిసం బయ్యె దరిద్రజీవితము లోకం బందు నేఁ డక్కటా!
జఠరాపూర్తికి భుక్తి, ధారణకు వస్త్రం బీపయిం గూర్చి ని
ర్గుణితస్వాంతులు గె పౌరు లైవెలయుటన్ రూపించి, దీపించి త్వ
ద్ధతవాదిత్వము నిల్పుకోఁ లయు సీతారామచంద్రప్రభూ! 84

మ. ప్రతినం బూనితి వౌఁ! ధర్మమును సంరక్షింప; నేఁ డేమొ త
త్ప్రతిభం జూపవు, మొఱ్ఱ లిన్వనవు, చేరందీయ వీదీనుల
న్వ్రత మేమైనది? దుష్టసంఘము ల దుర్వారంబుగా రెచ్చె ను
ద్ధతమై, వానిని ద్రుంప వేమిటికి? సీతారామచంద్రప్రభూ! 85

మ. మకల న్నిల్పఁగ రామరాజ్యమహిమ న్మాయాంధ్రరత్నంబులం
బురికొల్పంగదె రామదండుగను సంపూర్ణాపవర్గాప్తి కు
ద్ధురదీక్షం బనిసేయ; ము న్నిటనె నీకోర్కెక్తిమై రాక్షసో
త్కరముం గూల్చవె? మన్పవే బుషుల? సీతారామచంద్రప్రభూ! 86

మ. పరదాస్యావపూర్ణితార్యజనతాస్వాతంత్ర్యతత్త్వోన్నతిన్
బరిరక్షించుకొన న్సమర్థతను నాపాదింపవే, నీవె మా
శరణం; బెట్టు లనుగ్రహించెదవొ? మా సంప్రార్థనల్ వింము; నీ
దరికిం జేరినమమ్ము వీడకుము సీతారామచంద్రప్రభూ! 87

మ. అధికారుల్ పరదాస్యమత్తు లయి మర్త్యశ్రేణి నొప్పించి తా
మధికారుల్గఁ జరించుచుందు రిటి సహ్యం బెట్టు లౌ? నీమహో
కథ యువ్వారి కెదేవిధంబుగ నెఱుంగం జేసి వారి న్భవ
త్ప్రథితారాధనదీక్షులం జలుపు సీతారామచంద్రప్రభూ! 88

మ. వ్యసనోగ్రాహివిషప్రమత్తతఁ బ్రజావ్రాతమ్ము మూర్ఛ న్మునిం
గి సమాజ న్విడనాడి కొట్టుకొనెడున్ క్షిప్రింబ పోవ న్సమం
జస మా; మాంత్రికమౌళి వీ, విటు లుపేక్షం జేసిన న్మీఁద సం
తస మే మున్నది నీకుఁ? జెప్పఁగదె సీతారామచంద్రప్రభూ! 89

మ. ఇటు న న్నగ్నిపరీక్ష సేయుటకు నే నేపాటివాఁడ, న్సహిం
చుటకుం జాలను, నీవు నీసతియెడం జూపించు ప్రేమంబులో
నెటులే నించుక నాపయి న్నెఱపి నా కీజన్మదుఃఖమ్ము నిం
తటితో నైనను బూర్తి సేయఁగదె సీతారామచంద్రప్రభూ! 90

మ. పరివారమ్ము సుతుల్, గృహమ్ము తను వా, భాగ్యోపభోగమ్ము ని
ర్భరపూజావిధి, సత్సమాధి యగు నిద్రాముద్ర, వాక్కుల్ స్తుతుల్,
తిరుగం బూనుటయే ప్రదక్షిణము, చింతింపంగ నీ వాత్మ వి
త్తటి నేఁ జేయుపనుల్ త్వదర్చనమె సీతారామచంద్రప్రభూ! 91

వ. తట మంభోహృతుఁ, డశ్వగుండు తరు, వుద్యద్వ్యాప్తి భీతుండు ముం
దటి గేహం, బరిషుల్ గృహిన్, బ్రభుని దీనశ్రేణి, శీతార్త లు
త్కటవహ్నిం, దిమిరాకులుల్ దివియ నొంద న్హాఙ్గ మెంతబ్బు నం
తటి మోదం బిడు మాత్మ నిన్గొలుతు సీతారామచంద్రప్రభూ! 92

మ. సరసీజాకరము న్నిశాళిము, రణం జకోరింబులు, జ్ఞాతకో
త్కర మబ్దంబు, శశి న్నకోరములు నాకాంక్షించు లీల న్మదం
తరముం జిత్సుఖమృగ్యకేవలసుఖానందప్రదం బైనత్వ
ద్వరపాదాబ్జయుగంబుఁ గోరెదని సీతారామచంద్రప్రభూ! 93

మ. వనజాతాప్తుఁ డొకండె తా క్షితినభోవ్యాప్తాంధకారం బడం
చునెడం, గోటివిభాకరోజ్జ్వలుఁడ వౌచుం దోఁచు నీకెంత న
న్ననయంబుం గిటికొన్ తమం జెడపు టన్నా! సుప్రసన్నుండవై
దనరం జేయవె నన్ను నిత్యమును సీతారామచంద్రప్రభూ! 94

మ. పటుగాంభీర్య మగడ్త, ధైర్యము మహాప్రాకార, ముద్యద్గుణ
చ్ఛట సైన్యంబు, హృషీకముల్ గతులు, విజ్ఞానంబు సామగ్రి, హృ
త్పుటదుర్గంబున; కందు నీవు సతితో భోగంబులం బొందు మ
త్కటహర్షంబును నాకుఁ గూర్పఁగదె సీతారామచంద్రప్రభూ! 95

మ. నిను ధ్యానించుచు, నీపదాబ్జయుగముం నిత్యంబు సేవించుచున్
నినుఁ బ్రార్థించుచు, నీకె దిక్కనుచుఁ దండ్రీ! నమ్మినా న
మ్మనమందుం: నను నీ యపారకరుణ న్మన్నించుచుం సౌఖ్యా
ధనమున్ నాకు ననుగ్రహింపఁగదె సీతారామచంద్రప్రభూ! 96

మ. తతసారూప్యము నీసమర్చనను, ద్వాత్సామీప్యమున్ నీదు సం
స్తుతి, సాలోక్యము నీదుభక్తతతితో సంపొందుసద్గోష్ఠి, నూ
ర్జితసాయుజ్యము నీదుధ్యానమునఁ దండ్రీ! పొందియుంటన్ గృతా
ర్థత నే నందితి నిశ్చయంబునను సీతారామచంద్రప్రభూ! 97

మ. తనలోభాదిగుణాళిచే నొరులవిత్తంబుల్ హరింపంగ మ
న్మతి యుం దస్కరి యర్థనాధిపులధామంబుల్ ప్రవేశింపఁ గు
త్సితమార్గంబులఁ బట్టి పోయెడు; నెటుల్ శిక్షింతువో దీనిఁ ద్వ
త్ప్రతిభం? సత్ప్రభుమాళి వీవుగద! సీతారామచంద్రప్రభూ! 98

మ. అధికాశాప్లుతి, దుష్టభూపతులగేహద్వారదేశంబులన్
వ్యథ లొందించుచుఁ జావుపుట్టువుల నూటాడించుసంసారముం
విధివార్థిల్ దప్ప నటంచు మానుపవొ నన్ వేధింప కింకైనఁ ద్వ
త్పథముం జేరుపవయ్య మ్రొక్కెదను సీతారామచంద్రప్రభూ! 99

మ. వెలినో, యింటనొ, నీటనో, గుహనో, పృథ్వీభృచ్ఛిరంబందొ, కా
నలనో యెందొ తపింప నేమి యగు? డెందం బెప్పుడున్ నీపదం
బుల నెవ్వాఁడు లగించునో యతఁడె యొప్పన్ దివ్యయోగీంద్రుఁ డై
తలఁపంగా సుఖి వాఁడె సత్యముగ సీతారామచంద్రప్రభూ! 100

మ. తెలియంజాలక నీగుణం బొరుల నెంతే దేవురించుం జడుం
డల శుక్తిం రజతంబుగా, మణిగఁ గాచాశ్మంబుఁ, బిష్టోదకం
బుల క్షీరంబుగ, నెండమావుల జలంబుల్ గాఁగ భావించి యు
క్తులపాటుం గనునట్లె తత్తతిలి సీతారామచంద్రప్రభూ! 101

మ. వటువో, గేస్తొ, వనస్థుఁడో, జటియొ యెవ్వాఁడైనఁ గానిమ్ము ము
చ్చటగా నీకు స్వచిత్తపద్మ మిడినన్ సంసారభారంపులం
పట యవ్వానికిఁ గాక యుండునటు మోవంబూని నీ విత్తు వు
త్కటసౌఖ్యంబు నజస్రముం గరుణ సీతారామచంద్రప్రభూ! 102

మ. వనులన్, శైలములన్ జనుండు జడుఁడై వర్తించెడుం బూజసే
య నినుం బూవుల సేకరించుట కహో! స్వాత్మారవిందమ్ము నీ
కొనరం దా నిడి సుస్థిరంబుగను నీయొద్దన్ నిలన్ లేఁడు వం
తను గొట్లాడుచునుండు మాటికిని సీతారామచంద్రప్రభూ! 103

మ. ప్రభు వీ వొటనె దీనబాంధవుఁడ వై భాసిల్లుచున్నావు, దై
న్యభృతాంతఃకరణుండ నేను, మనబాంధవ్యంబు భవ్యంబు; నా
కభయం బిచ్చి దొసంగులన్ సయిఁచు టయ్యా! బంధుమర్యాద; త
త్ప్రభవానందము నా కొసంగు మిఁక సీతారామచంద్రప్రభూ! 104

మ. కపినే దానికిశోర మూనెదుగఁగన్ గాఢంపుసద్భక్తి ని
న్నెప్పుడుం గైకొని వీడకుంటి; నిటుపై నీవే కృపన్ నన్ బా
లపుడింభంబువిధాన సాఁకవలె, నీలా గీ వుపేక్షించి హా!
తపనం బందునఁ ద్రోతువో కొ— నను సీతారామచంద్రప్రభూ! 105

మ. ఫలసంసిద్ధికి దేవ్వరించుచు నహంభావమ్ముతోఁ గర్మముల్
సలుపన్ మోసముగాక తప్ప, దిది నిష్కామక్రియాధూర్వహుం
డల సామీరి సహించునే? యెరియఁజేయన్ లేదె లంకాపురిన్?
దలఁగుం గీడు భవత్సపర్యలను సీతారామచంద్రప్రభూ! 106

మ. తళుకుల్ గుల్కెడు తారహారమును సీతాదేవి మున్నీయ, నం
దొలయుంబోవదు నీదు తత్త్వ మని తా నొల్లంగఁబో, కింత లిం
తలుగాఁ ద్రుంపఁడె వాయునందనుఁడు? సత్కారమ్ము సుస్థాయియై
తలఁపుం దన్పకయున్నచో వృథయె సీతారామచంద్రప్రభూ! 107

మ. అనువర్తించును నాంజనేయుఁ డతిభృత్యత్వమ్ముఁ జూపింప, సీ
తను వామాంకమునందు లాలనల నత్యంతప్రీతి నొందింతు నీ
ఘనతత్త్వాకృతి నేనె యంచు నెఱుఁగంగా నేర్తు నద్వైతత
త్త్వనిరూఢాత్ముఁడ నౌటఁ దీర్ఘకృప సీతారామచంద్రప్రభూ! 108

మ. పరిజ దేవుండ వటంచు నెందనుక నిన్భావింతు నద్వైతత
త్త్వజయశ్రీ విలసిల్లు నందనుక మన్మత్తేభదానోల్లస
త్సుజనేందిందిరకందళోత్కరము సంతుష్టాత్మతన్ మించుఁ గా
త! జగన్మాన్యగసజ్జితోత్సుకత సీతారామచంద్రప్రభూ! 109

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



శా. "అంకం డీశ్వరుఁ డెందు సంస్కరణమా యాన్నత్తి? వమ్మయ్యె శే
షంకోపేనవిధమ్ము మున్నె; యిటుపై స్వాతంత్ర్యతత్త్వమ్ము న
స్తుంకార మ్మొనరించుచేటి శుభద'' మంచున్ సత్యముం దెల్పు భా
రంకోటావన! హేమశైలభవనా! శ్రీసత్యనారాయణా!

చ. పలుమడు లేలఁ నాదు ప్రతిపద్యము శాసనరాజమేసుమా,
ఫలకము నిర్మలం బగుచుభాసిలు మానవజాతిజిహ్వయే;
లలితరసప్రసంగతిఁ జెలంగు జగమ్మునయందు నద్ది; చు
క్కలగుమి మింట నెందనుకఁ గ్రాలునొ యందనుకన్ వెలుంగుచున్

